



# స్తుతి శతకమ్ (మూక పంచశతి .3)

శ్రీరస్తు

- భావార్థముతో. -

శుభమస్తు







అవిఘ్నమస్తు





సేకరణ: కిరణ్ టైప్ ఇనిస్టిట్యూట్, 41-1/8-13A,
గౌతమీనగర్,3వ లైను, కృష్ణలంక, విజయవాడ-520 013.
https://madhirafamily.wordpress.com/

# స్తుతి శతకమ్ (మూక పంచశతి-3) భావార్థముతో

01. పాండిత్యం పరమేశ్వరి స్తుతివిధౌ నైవాశ్రయంతే గిరాం
వైరించాన్యపి గుంఫనాని విగలద్గర్వాణి శర్వాణి తే।
స్తోతుంత్వాం పరిఫుల్లనీలనలినశ్యామాక్షి కామాక్షి మాం
వాచాలీకురుతే తథాపి నితరాం త్వత్పాదసేవాదరః॥

అమ్మా! జగదీశ్వరీ! కామాక్షీ! ఎంతో చల్లదనమును ప్రసాదించే నల్ల కలువలవంటి నేత్రములు కలిగిన నిన్ను, బ్రహ్మాదులు సైతం స్తుతించలేక పోతే, నీ పాద దర్శనం నిరంతరం చేయాలనీ, నిన్ను స్తుతించాలనే కోరిక నాతో ఈ పలుకులను పలికేలా చేస్తున్నది.

02. తాపింఛస్తబకత్విషే తనుభృతాం దారిద్ర్యముద్రాద్విషే
సంసారాఖ్యతమోముషే పురరిపోర్వామాంకసీమాజుషే।
కంపాతీరముపేయుషే కవయతాం జిహ్వాకుటీం జగ్ముషే
విశ్వత్రాణపుషే నమోస్తు సతతం తస్మై పరంజ్యోతిషే॥

జగన్మాతా! రక్త వర్ణపు కాంతితో, మా దారిద్ర్యమును తొలగించి, అజ్ఞానమనే తిమిరాంధకారమును రూపుమాపి, ఈశ్వరుని వామ భాగమున వసించి, కవుల నాలుకపై సంచరిస్తూ, కంపానదీ తీరమున సంచరించే దివ్యజ్యోతికి నమస్కరిస్తున్నాను.

03. యే సంధ్యారుణయంతి శంకరజటాకాంతారచంద్రార్భకం
సిందూరంతి చ యే పురందరవధూసీమంతసీమాంతరే।
పుణ్యం యే పరిపక్వయంతి భజతాం కాంచీపురే మామమీ
పాయాసుః పరమేశ్వరప్రణయినీపాదోద్భవాః పాంసవః॥

అమ్మా! నీవు ఈశ్వరుని ప్రేమకు పాత్రురాలైనదానవు. ఈశ్వరుని సిగలో కొలువైన చంద్రునికి నీ ఎర్రని పాదములు ఎర్రటి సంధ్యాకాంతులను, శచీదేవి పాపిటలో సిందూరపు కాంతులను, ఆపాదిస్తున్నాయి. కాంచీపురములో స్థితురాలై, మమ్ములను కరుణిస్తున్న నీ పాదధూళి కణములు మమ్ములను రక్షించుగాక.

04. కామాడంబరపూరయా శశిరుచా క్రమస్మితానాం త్విషా
కామారేరనురాగసింధుమధికం కల్లోలితం తన్వతీ।
కామాక్షీతి సమస్తసజ్జననుతా కళ్యాణదాత్రీ నృణాం
కారుణ్యాకులమానసా భగవతీ కంపాతటే జృంభతే॥

కంపానదీ తీరమున వసించిన నిన్ను జ్ఞానులు కామాక్షీ అని స్తుతిస్తున్నారు. చంద్రకాంతివంటి వెన్నెల కాంతులు కలది నీ నవ్వు. ఆ చిరునవ్వే, ఈశ్వరుని అనురాగమనే సముద్రపు అలలను ఉప్పొంగేలా చేస్తున్నది. అదే నవ్వు మాకందరికి శుభములను కలిగిస్తున్నది.

05. కామాక్షీణపరాక్రమప్రకటనం సంభావయంతీ దృశా
శ్యామా క్షీరసహోదరస్మితరుచిప్రక్షాలితాశాంతరా।
వామాక్షీజనమౌళిభూషణ మణిర్వాచాం పరా దేవతా
కామాక్షీతి విభాతి కాపీ కరుణా కంపాతటీన్యాస్తటే॥

శివునిచే నశింపచేయబడిన కామదేవుని తిరిగి ప్రకటించినది, క్షీరమువలే నిర్మలమైన మందహాసముతో దిక్కులన్నిటినీ ప్రసన్నము చేయగలది, సుందరమైన నేత్రములు కలది, భక్తులు శిరసునదాల్చు పాదములు కలది, కరుణారూపిణి, పరదేవత అయిన కామాక్షీ దేవి కంపానది తీరమున వెలుగుచున్నది.

06. శ్యామా కాచన చంద్రికా త్రిభువనే పుణ్యాత్మనామాననే
సీమాశూన్యకవిత్వవర్షజననీ యా కాపి కాదంబినీ।
మారారాతిమనోవిమోహనవిధౌ కాచిత్తమఃకందలీ
కామాక్ష్యాః కరుణాకటాక్షలహరీ కామాయ మే కల్పతామ్॥

అమ్మా! నీవు అన్ని జగములలోనూ వ్యాపించిన వెన్నెలవు. జ్ఞానులు, సర్వసంగులు అయినవారినుండి వెలువడే కవిత్వ ధారలు నీవే. మన్మథుడంతవాణ్ణి జయించిన ఈశ్వరుని మనసునే నీవు మోహింపచేసావు. అటువంటి నీ క్రీగంటి చూపులు నాపై ప్రసరించుగాక.

07. ప్రౌఢధ్వాంతకదంబకే కుముదినీపుణ్యాంకురం దర్శయన్
జ్యోత్స్నా సంగమనేపి కోకమిథునం మిశ్రం సముద్భావయన్।
కాలిందీలహరీదశాం ప్రకటయన్కమ్రాం నభస్యద్భుతాం
కశ్చిన్నేత్రమహోత్సవో విజయతే కాంచీపురే శూలినః॥

నల్లని కురులతో చంద్రరేఖ తెల్లగా దర్శనమిస్తూ, చక్రవాకపు జంటవలే ఉన్న మాతృస్థానములతో, ఉదరముపై యమునా నది వలె నల్లని నూగారుతో, ఈశ్వరునికి కనుల పండుగగా ఒక మహాశక్తి కాంచీపురములో ప్రకాశించుచున్నది.

08. తంద్రాహీన తమాలనీల సుషమైస్తారుణ్యలీలాగృహైః
తారానాథ కిశోరలాంఛితకచైస్తామ్రారవిందేక్షణైః।
మాతః సంశ్రయతాం మనో మనసిజప్రాగల్భ్యనాడింధమైః
కంపాతీరచరైర్ఘనస్తనభరైః పుణ్యాంకరైః శాంకరైః॥

నల్లనికాంతి గల శరీర వర్ణముతో, సిగలో చంద్రవంకను ధరించి, ఎర్ర కలువలను బోలిన నేత్రములతో, కామదేవుని అనుగ్రహించి, కంపాతీరములో విహరిస్తున్న ఈశ్వరుని తపః ఫలమైన నీవు నా మనసును సంస్కరించు తల్లీ.

09. నిత్యం నిశ్చలతాముపేత్య మరుతాం రక్షావిధిం పుష్ణతీ
తేజస్సంచయపాటవేన కిరణానుష్ణద్యుతేర్ముష్ణతీ।
కాంచీమధ్యగతాపి దీప్తిజననీ విశ్వాంతరే జృంభతే
కాచిచ్చిత్రమహో స్మృతాపి తమసాం నిర్వాపికా దీపికా॥

అమ్మా! కామాక్షీ! నీవు నిశ్చలమైన దానివైనా, నిరంతరం చలించే దేవతలకు రక్షణ కల్పిస్తావు. నీ తేజోమయమైన కాంతి కిరణములు సూర్యకాంతిని తిరస్కరిస్తాయి. కాంచీపురములో కొలువైన నీవు అక్కడినుండే సమస్త విశ్వమునకు వెలుగును ప్రసాదిస్తూ, అంధకారమును నశింపచేస్తావు.

10. కాంతైః కేశరుచాం చయైర్భ్రమరితం మందస్మితైః పుష్పితం
కాంత్యా పల్లవితం పదాంబురుహయోర్నేత్రత్విషా పత్రితమ్।
కంపాతీరవనాంతరం విదధతీ కల్యాణజన్మస్థలీ
కాంచీమధ్యమహామణిర్విజయతే కాచిత్కృపాకందలీ॥

అమ్మా! నీ కేశముల కాంతులకు తుమ్మెదలు ఆకర్షింపబడుతున్నాయి. కంపానదీ తీరములో దయామూర్తియైన వృక్షమునకు, నీ పాదములు కొమ్మలుగాను, నయన కాంతులు ఆకులగాను, చిరునవ్వులు పుష్పములు గానూ అమరి ఉన్నవి.

11.రాకాచంద్రసమానకాంతివదనా నాకాధిరాజస్తుతా
మూకానామపి కుర్వతీ సురధునీనీకాశవాగ్వైభవమ్।
శ్రీకాంచీనగరీవిహారరసికా శోకాపహంత్రీ సతామ్
ఏకా పుణ్యపరంపరా పశుపతేరాకారిణీ రాజతే॥

పౌర్ణమి నాటి చంద్రబింబ కాంతిని పోలిన ముఖము కలది, ఇంద్రునికి స్తుతిపాత్ర మైనది, పుట్టు మూగవారికి కూడా గంగాఝరివంటి వాక్ ప్రవాహమును కరుణించగలది, శివునికి తపఃఫలమైనది, సద్గుణుల దుఃఖములను హరించేది అయిన ఒక మాత కాంచీ పురములో ప్రకాశిస్తున్నది.

12. జాతా శీతలశైలతః సుకృతినాం దృశ్యా పరం దేహినాం
లోకానాం క్షణమాత్రసంస్మరణతః సంతాపవిచ్ఛేదినీ।
ఆశ్చర్యం బహు ఖేలనం వితనుతే నైశ్చల్యమాబిభ్రతీ
కంపాయాస్తటసీమ్ని కాపి తటినీ కారుణ్యపాథోమయీ॥

హిమాలయములలో ఉద్భవించినది, అభక్తులకు లభ్యము కానిది, పుణ్యాత్ములకు మాత్రమే దర్శనమిచ్చేది, జీవుల బాధలను తొలగించేది, తాను నిశ్చలయై కూడా, చలిస్తూ కరుణ అనే నదీప్రవాహముగా ఉన్న కామాక్షీదేవి కాంచీపురములో స్థితురాలై ఉన్నది.

13. ఐక్యం యేన విరచ్యతే హరతనౌ దంభావపుంభావుకే
రేఖా యత్కచసీమ్ని శేఖరదశాం నైశాకరీ గాహతే।
ఔన్నత్యం ముహురేతి యేన స మహోన్మేనాసఖః సానుమాన్
కంపాతీరవిహారిణా సశరణాత్తేనైవ ధామ్నావయమ్॥

తన శరీరముచే, వర్ణముచే ఈశ్వరుని శరీరమును పూర్తిగా కప్పివేస్తూ, సిగలో బాలచంద్రుని ఆభరణముగా ధరించి, మేనాదేవి భర్త హిమవంతుని ఇంటికి గౌరవమాపాదించి, కంపా తీరమున సంచరిస్తున్న తల్లిని శరణు వేడుతున్నాను.

14. అక్ష్ణోశ్చ స్తనయోః శ్రియా శ్రవణయోర్బాహ్వోశ్చ మూలం స్పృశన్
ఉత్తంసేన ముఖేన చ ప్రతిదినం ద్రుహ్యన్పయోజన్మనే।
మాధుర్యేణ గిరాం గతేన మృదునా హంసాంగనాం హ్రేపయన్
కాంచీసీమ్ని చకాస్తి కోపి కవితాసంతానబీజాంకురః॥

కర్ణములవరకు విస్తరించి ఉన్న విశాల నేత్రములు, భుజమూలములను తాకే మాతృస్థానములు, కమలముల కాంతిని దోచుకునే ముఖమండలము, పలుకులలోని మాధుర్యము, మందమైన నడకలు కలిగిన ఒక మాతృమూర్తి కాంచీపురములో స్థితురాలై ఉన్నది.

15. ఖండం చాంద్రమసం వతంసమనిశం కాంచీపురే ఖేలనం
కాలాయశ్ఛవితస్కరీం తనురుచిం కర్ణేజపే లోచనే।
తారుణ్యోష్మనఖంపచం స్తనభరం జంఘాస్పృశం కుంతలం
భాగ్యం దేశికసంచితం మమ కదా సంపాదయేదంబికే॥

నల్లని శరీర వర్ణముతో, బాలచంద్రుని ఆభరణముగా ధరించి, దీర్ఘ నయనములు కలిగి, యౌవనవంతురాలై, పిరుదులవరకు ఉన్న జడతో ఉన్న ఒక మాతృ రూపమును నా గురుదేవులు నాకు దర్శింపచేశారు.

16. తన్వానం నిజకేలిసౌధసరణీం నైసర్గికీణాం గిరాం
కేదారం కవిమల్లసూక్తిలహరీసస్యశ్రియాం శాశ్వతమ్।
అంహోవంచనచుంచు కించన భజే కాంచీపురీమండనం
పర్యాయచ్ఛవి పాకశాసనమణేః పౌష్పేషవం పౌరుషమ్॥

స్వయంజనితములైన వేదములను తన సంచార ప్రదేశముగా చేసుకున్నది, కవులు పారించే కవిత్వ ధారలు ప్రవహించే పంట పొలమైనది, జీవుల పాపములను హరించునది, ఇంద్రనీల మణుల కాంతి ప్రవాహము కలది, కాంచీపురములో స్థితురాలైన ఒక శక్తి నాకు ప్రేరణగా నిలచినది.

17. ఆలోకే ముఖపంకజే చ దధతీ సౌధాకరీం చాతురీం
చూడాలంక్రియమాణపంకజవ నీవైరాగమప్రక్రియా।
ముగ్ధస్మేరముఖీ ఘనస్తనతటీమూర్ఛాలమధ్యాంచితా
కాంచీసీమని కామినీ విజయతే కాచిజ్జగన్మోహినీ॥

అమ్మ ముఖము అమృతమును చిందిస్తుంది. ఆమె చూపులు కరుణారస పూరితములు. ఎల్లప్పుడూ చిరునవ్వుకలిగిన మోము, అత్యంత సన్నని కటి ప్రదేశము, సకల జగత్తులను తన వశము చేసుకొనగల ఒక స్త్రీ కాంచీపురములో ప్రకాశించుచున్నది.

18. యస్మిన్నంబ భవత్కటాక్షరజనీ మందేఽపి మందస్మిత
జ్యోత్స్నా సంస్నపితా భవత్యభిముఖీ తం ప్రత్యహో దేహినమ్।
ద్రాక్షామాక్షికమాధురీ మదభరవ్రీడాకరీ వైఖరీ
కామాక్షి స్వయమాతనోత్యభిసృతిం వామేక్షణేవ క్షణమ్॥

అమ్మా! నీ మందహాసము, నీ కరుణారస దృష్టి ఎవరిపై ప్రసరిస్తుందో, అతడు మందమతియైనా, కవితా కన్యక స్వయముగా అతనిని వరించి రావటము చాలా ఆశ్చర్యకరమైన విషయము.

19. కాలిందీజలకాంతయః స్మితరుచిస్స్వర్వాహినీపాథసి
ప్రౌఢధ్వాంతరుచః స్ఫుటాధరమహోలౌహిత్యసంధ్యోదయే।
మణిక్యోపలకుండలాంశుశిఖిని వ్యామిశ్రధూమశ్రియః
కల్యాణైకభువః కటాక్షసుషమాః కామాక్షి రాజంతి తే॥

అమ్మా! నీ క్రీగంటి చూపుల కాంతులు, తెల్లని ఆకాశగంగలో, నల్లని యమునానది నీటివలే, సాయం సంధ్యపు ఎర్రని కాంతులలో నల్లని చీకటివలె, అత్యంత శుభప్రద మైనవిగా గోచరిస్తున్నాయి.

20. కలకలరణత్కాంచీ కాంచీవిభూషణమాలికా
కచభరలసచ్చంద్రా చంద్రావతంససధర్మిణీ।
కవికులగిరః శ్రావంశ్రావం మిలత్పులకాంకురా
విరచితశిరఃకంపా కంపాతటే పరిశోభతే॥

అమ్మా! కాంచీపురమునకు ఆభరణమైన వడ్డాణమును అలంకరించుకుని, జగదీశ్వరుని దేవేరివై, సిగలో పుష్పమువలే చంద్రుని ధరించి, ఎంతో ఆనందముగా కవుల ప్రశంసలను వింటూ, పరవశముగా శిరసును అటూ ఇటూ ఊపుతూ పులకరిస్తున్న తల్లి కంపా తీరములో ఉన్నది.

21. సరసవచసాం వీచీ నీచీభవన్మధుమాధురీ
భరితభువనా కీర్తిర్మూర్తిర్మనోభవజిత్వరీ।
జనని మనసో యోగ్యం భోగ్యం నృణాం తవ జాయతే
కథమివ వినా కాంచీభూషే కటాక్షతరంగితమ్॥

కాంచీపురమునకు ఆభరణమైన ఓ కామాక్షీ! నీ పలుకులు మధురమైన తియ్యదనములు కలిగి, నీ కీర్తి దిగంతముల వరకు వ్యాపించి, నీ సౌందర్యం మన్మథుని త్రోసి రాజని, నీ క్రీగంటి చూపులు మాకు సకల వాంఛలను తీర్చేవిగా ఉన్నాయి.

22. భ్రమరితసరిత్కూలో నీలోత్పలప్రభయాభయా
నతజనతమఃఖండీ తుండీరసీమ్ని విజృంభతే।
అచలతపసామేకః పాకః ప్రసూనశరాసన
ప్రతిభటమనోహారీ నారీకులైక శిఖామణిః॥

తన శరీర వర్ణము, భ్రమరములను సైతము ఆకర్షించే నల్లని ప్రకాశము కలిగి, ఆ నలుపు వర్ణము మాలోని అజ్ఞానమును తొలగిస్తూ, పర్వతరాజు తపఃఫలముగా జన్మించి, మన్మథుని మించిన సౌందర్యము కలదై, స్త్రీకుల భూషణమైన ఒక యువతి తుండీర దేశమనే కాంచీపురములో ప్రకాశించుచున్నది.

23. మధురవచసో మందస్మేరా మతంగజగామినః
తరుణిమజుషస్తాపిచ్ఛాభాస్తమఃపరిపంథినః।
కుచభరనతాః కుర్యుర్భద్రం కురంగవిలోచనాః
కలితకరుణాః కాంచీభాజః కపాలిమహోత్సవాః॥

అమ్మా! తీయని మాటలు, మందహాసము, మెల్లని నడకలు, చీకటిని మించిన నల్లని కాంతులు, కుచముల బరువుతో వంగిన కటి ప్రదేశము, లేడి కన్నులను తిరస్కరించే నేత్రములతో, ఈశ్వరునికి ఆనందము కలిగిస్తూ, కాంచీపురములో ప్రకాశించు మాత మమ్ములను కరుణించుగాక.

24. కమలసుషమాకక్ష్యారోహే విచక్షణవీక్షణాః
కుముదసుకృతక్రీడాచూడాలకుంతలబంధురాః।

రుచిరరుచిభిస్తాపిచ్ఛశ్రీప్రపంచనచుంచవః
పురవిజయినః కంపాతీరే స్ఫురంతి మనోరథాః॥

అమ్మా! నీ నేత్రములు కమలముల శోభను త్రోసిరాజన్నవి. కలువలు అమితముగా అభిమానించే చంద్రుడు, నీ సిగలో ఆభరమైనాడు. ఈశ్వరుని ఆలోచనల ప్రతిరూపమైన నీవు కంపా తీరములో విహరిస్తున్నావు.

25. కలితరతయః కాంచీలీలావిధౌ కవిమండలీ
వచనలహరీవాసంతీనాం వసంతవిభూతయః।
కుశలవిధయే భూయాసుర్మే కురంగవిలోచనాః
కుసుమవిశిఖారాతేరక్ష్ణాం కుతూహలవిభ్రమాః॥

అమ్మా! కాంచీ పురమన్నా, కంపాతీర విహారమన్నా నీకు ఎంత ప్రీతి తల్లీ. లేడి కనులను మించిన నేత్రములు, ఈశ్వరుని మురిపించే నడకల సొబగులు, మొత్తం కలగలిసి, కవుల వర్ణనల వసంత ఋతు శోభలు, మమ్ములను కరుణించుగాక.

26. కబలితతమస్కాండాస్తుండీరమండలమండనాః
సరసిజవనీసంతానానామరుంతుదశేఖరాః।
నయనసరణేర్నేదీయంసః కదా ను భవంతి మే
తరుణజలదశ్యామాః శంభోస్తపఃఫలవిభ్రమాః॥

అమ్మా! చీకటిని మించిన నలుపు వర్ణము కలవి, పద్మములు ముడుచుకునే, చంద్రఖండమును సిగలో అలంకరించుకున్నవి, జలముతో నిండిన నల్లని మేఘముల వంటివి, శివునకు తపః ఫలమైన నీ విలాసములు నీ ఈ పుత్రునికి ఎప్పుడు దృష్టిగోచరమౌతాయి మాతా!

27. అచరమమిషుం దీనం మీనధ్వజస్య ముఖశ్రియా
సరసిజభువో యానం మ్లానం గతేన చ మంజునా।
త్రిదశసదసామన్నం ఖిన్నం గిరా చ వితన్వతీ
తిలకయతి సా కంపాతీరం త్రిలోచనసుందరీ॥

అమ్మా! నీ వదనము కాంతిని చూసి, పద్మములు వెలవెల పోతున్నాయి. సృష్టికర్త యైన బ్రహ్మ వాహనమైన హంస, నీ నడకలచే ఓడింపబడినది. నీ పలుకులు దేవతలు స్వీకరించిన అమృతముకంటే ఎంతో మధురముగా ఉన్నాయి. ఇట్టి లక్షణములు కలిగిన ఈశ్వరుని దేవేరి కంపా తీరమును ప్రకాశింప చేయుచున్నది.

28. జనని భువనే చంక్రమ్యేహం కియంతమనేహసం
కుపురుషకరభ్రష్టైర్దుష్టైర్ధనైరుదరంభరిః।
తరుణకరుణే తంద్రాశూన్యే తరంగయ లోచనే
నమతి మయి తే కించిత్కాంచీపురీమణిదీపికే॥

అమ్మా! కేవలము నా క్షుద్బాధ తీర్చుకోవడం కోసం నీచులు అధర్మ మార్గములో ఆర్జించిన ధనమును పొందటం కోసం నేను ఇంకా ఎంతకాలము వారి చుట్టూ పరిభ్రమించాలి? నా ఈ దీనస్థితి నీకు తెలియదా? ఓ కరుణామూర్తీ, నీ చల్లని చూపులు నాపై ప్రసరింపచేసి, నన్ను గట్టెక్కించవమ్మా!

29. మునిజనమనఃపేటీరత్నం స్ఫురత్కరుణానటీ
విహరణకలాగేహం కాంచీపురీమణిభూషణమ్।
జగతి మహతో మోహవ్యాధేర్నృణాం పరమౌషధం
పురహరదృశాం సాఫల్యం మే పురః పరిజృంభతామ్॥

మునీశ్వరుల హృదయమనే పేటికలోని రత్నమా! నా హృదయమనే నర్తనశాలలో నర్తించే ఓ నర్తకీ, కాంచీపురములో వెలసిన ఆభరణమా, మా మనోవ్యాధులను తొలగించే దివ్యౌషధమా, ఈశ్వరుని నేత్రానందమా, ఇంకా ఎందుకు నన్ను కరుణించడానికి ఆలస్యం చేస్తున్నావు?

30. మునిజనమనోధామ్నే ధామ్నే వచోమయజాహ్నవీ
హిమగిరితటప్రాగ్భారాయాక్షరాయ పరాత్మనే।
విహరణజుషే కాంచీదేశే మహేశ్వరలోచన
త్రితయసరసక్రీడాసౌధాంగణాయ నమో నమః॥

అమ్మా! నీవు మునీశ్వరుల హృదయములోను, గంగాఝరివంటి కవిత్వపటిమకు హిమాలయ పర్వతమువలే ఉన్నతమై నిలిచావు. పరంజ్యోతి స్వరూపమై, ఈశ్వరుని తన కేళీవిలాసములతో సమ్మోహపరిచే కామాక్షీ, నీకివే నా ప్రణతులు.

31. మరకతరుచాం ప్రత్యాదేశం మహేశ్వరచక్షుషామ్
అమృతలహరీపూరం పారం భవాఖ్యపయోనిధేః।
సుచరితఫలం కాంచీభాజో జనస్య పచేలిమం
హిమశిఖరిణో వంశస్యైకం వతంసముపాస్మహే॥

మరకతముల ప్రకాశమును తిరస్కరించేది, ఈశ్వరుని నేత్రములకు ఆనందమును కలిగించేది, సంసారమనే సాగరమునకు తీరమైనది, కాంచీపురములో వెలసిన పుణ్యము, హిమవంతుని వంశమునకు శ్రేష్ఠత ఆపాదించినది అయిన కామాక్షీ దేవిని ధ్యానిస్తున్నాను.

32. ప్రణమనదినారంభే కంపానదీసఖి తావకే
సరసకవితోన్మేషః పూషా సతాం సముదంచితః।
ప్రతిభటమహాప్రౌఢప్రోద్యత్కవిత్వకుముద్వతీం
నయతి తరసా నిద్రాముద్రాం నగేశ్వరకన్యకే॥

కంపానదితో చెలిమి చేస్తూ, నిన్ను స్మరించిన భక్తులలో కవిత్వ రసధారలను ఉదయింపచేస్తూ, ఎదుటివారి ప్రతిభను వెనక్కి నెట్టి వారి కవిత్వమనే తీగను నిద్రావస్థలోనికి జార్చివేస్తావు.

33. శమితజడిమారంభా కంపాతటీనికటేచరీ
నిహతదురితస్తోమా సోమార్ధముద్రితకుంతలా।
ఫలితసుమనోవాంఛా పాంచాయుధీ పరదేవతా
సఫలయతు మే నేత్రే గోత్రేశ్వరప్రియనందినీ॥

కంపాతీర విహారిణి, జీవులలోవ్యాప్తి చెందే జడత్వమును నివారించునది, సిగలో చంద్రఖండమును ధరించినది, పెరిగిపోయిన పాపరాశిని దగ్ధము చేసేది, దేవతల వాంఛలను ఈడేర్చేది, కామదేవుడైన మన్మథునికీ ఉపాసనా దైవము, హిమవత్పర్వతపుత్రి అయిన తల్లి నాకు ప్రసన్నమగుగాక!

34. మమ తు ధిషణా పీడ్యా జాడ్యాతిరేక కథం త్వయా
కుముదసుషమామైత్రీపాత్రీవతంసితకుంతలామ్।
జగతి శమితస్తంభాం కంపానదీనిలయామసౌ
శ్రియతి హి గలత్తంద్రా చంద్రావతంససధర్మిణీమ్॥

కలువల రేడైన చంద్రుని సిగలో ధరించి, జగదీశ్వరుని దేవేరియై, జగములోని అలసత్వమును పారద్రోలి, కంపాతీరములో విహరించే కామాక్షీ దేవిని శరణు వేడిన నన్ను, ఈ జడత్వము పీడించగలదా! అసంభవం.

35. పరిమళపరీపాకోద్రేకం పయోముచి కాంచనే
శిఖరిణి పునర్ద్వైధీభావం శశిన్యరుణాతపమ్।
అపి చ జనయంకంబోర్లక్ష్మీమనంబుని కోప్యసౌ
కుసుమధనుషః కాంచీదేశే చకాస్తి పరాక్రమః॥

నల్లని మేఘమువంటి అమ్మ శిరోజములకు సుగంధమును, బంగారు పర్వతమునకుబోలు రెండు మాతృస్థానములను, సంధ్యాకాలపు చంద్రబింబములోని

ఎర్రదనమును పోలిన పెదవులను, నీటితో నిండిన శంఖము వంటి కంఠమును కలిగి పూలబాణములను ధరించిన మాత కాంచీపురములో ప్రకాశిస్తున్నది.

36. పురదమయితుర్వామోత్సంగస్థలేన రసజ్ఞయా
సరసకవితాభాజా కాంచీపురోదరసీమయా।
తటపరిసరైర్నీహారాద్రేర్వచోభిరకృత్రిమైః
కిమివ న తులామస్మచ్చేతో మహేశ్వరి గాహతే॥

త్రిపురహరుడైన ఈశ్వరుని వామ భాగమును అధిష్టించినది, కవులలో రస స్వరూప మైనది, కాంచీపురములో స్థితురాలైనది, హిమాలయ సానువులలో సంచరించునది, వేదసారమైనది అయిన అమ్మలో నా మనసు ఎందుకు ఏకాగ్రతను పొందటంలేదో అర్థము కాకున్నది.

37. నయనయుగళీమాస్మాకీనాం కదా ను ఫలేగ్రహీం
విదధతి గతౌ వ్యాకుర్వాణా గజేంద్రచమత్క్రియామ్।
మరకతరుచో మాహేశానా ఘనస్తనన్రమితాః
సుకృతవిభవాః ప్రాంచః కాంచీవతంసధురంధరాః॥

మందమైన తన చలనముతో గజములకు నడక నేర్పునదీ, మరకత మణుల కాంతులతో ప్రకాశించునది, వంగిన కటిప్రదేశము కలది, ఈశ్వరుని తపఃఫలము, పూర్వజ అయిన కామాక్షిదేవి నాకు ఎప్పుడు దర్శన భాగ్యమును ప్రసాదిస్తుందో కదా!

38. మనసిజయశఃపారంపర్యం మరందఝురీసువాం
కవికులగిరాం కందం కంపానదీతట మండనమ్।
మధురలలితం మత్కం చ క్షుర్మనీషిమనోహరం
పురవిజయినః సర్వస్వం తత్పురస్కురుతే కదా॥

మన్మథుని యశస్సుకు మూలమైనది, తేనెలూరు కవితా సంపదకు ఆద్యము, కంపానదికి అలంకారమైనది, జ్ఞానుల మనసును ఆకర్షించునది, మధురము, ఈశ్వరునికి అన్నీ తానైన కామాక్షి దేవి నాకు ఎప్పుడు తన దర్శన భాగ్యమును కలుగచేస్తుందో కదా!

39. శిథిలితతమోలీలాం నీలారవిందవిలోచనాం
దహనవిలసత్ఫాలాం శ్రీకామకోటీముపాస్మహే।
కరధృతలసచ్ఛాలాం కాలారిచిత్తహరాం పరాం
మనసిజకృపాలీలాం లోలాలకామలికేక్షణామ్॥


Kiron Type Institute

జీవులలో తమోగుణము అనే అజ్ఞానమును తరిమివేయునది, నల్ల కలువలను పోలిన నేత్రములు కలది, కామకోటిపీఠములో వసించునది, ఫాలభాగమున అగ్ని నేత్రము కలది, యముని సంహరించి పునర్జీవితుని చేసిన హరుని మనసు గెలుచుకున్నది, మన్మథుని కనికరించినది అయిన కామాక్షీ మాతను ప్రార్థిస్తాను.

40. కలాలీలాశాలా కవికులవచఃకైరవవనీ
శరజ్జ్యోత్స్నాధారా శశధరశిశుశ్లాఘ్యముకుటీ
పునీతే నః కంపాపులినతటసౌహార్దతరలా
కదా చక్షుర్మార్గం కనకగిరిధానుష్కమహిషీ॥

కళాస్వరూపములకు క్రీడాస్థలము, కవిత్వ ధారలనే కలువ తోటలకు చంద్ర కిరణముల కాంతి, చంద్రుని సిగలో ధరించినది, కంపానదీ తీరమునకు మిత్రురాలు, మేరు పర్వతమును ధనుస్సుగా ధరించిన త్రిపురహరుని దేవేరి అయిన జగన్మాత నా నేత్రములకు ఎప్పుడు ధన్యత్వమును ప్రసాదిస్తుందో కదా!

41. నమః స్తాన్నమ్రేభ్యః స్తనగరిమగర్వేణ గురుణా
దధానేభ్యశ్చూడాభరణమమృతస్యంధి శిశిరమ్।
సదా వాస్తవ్యేభ్యః సువిధభువి కంపాఖ్యసరితే
యశోవ్యాపారేభ్యః సుకృతవిభవేభ్యో రతిపతేః॥

అత్యంత గొప్పవై, సకల జీవులను పోషించే, పోషణాస్థానముల బరువుతో వంగిన నడుము కలదై, అమృతము వంటి శీతల ధారలను కురిపించే శశాంకుని సిగలో ధరించి, కంపానదీ తీరములో విహరిస్తూ, ఈశ్వరుని తపఃఫలమైన కామాక్షీ దేవికి ప్రణమిల్లుతున్నాను.

42. అసూయంతీ కాచిన్మరకతరుచో నాకిముకుటీ
కదంబం చుంబంతీ చరణనఖచంద్రాంశుపటలైః।
తమోముద్రాం విద్రావయతు మమ కాంచీర్నిలయనా
హరోత్సంగశ్రీమన్మణిగృహమహాదీపకలికా॥

అమ్మ శరీర కాంతులు మరకతమణి కాంతులను త్రోసిరాజంటున్నవి. ఆమె పాద నఖముల కాంతి సకల దేవతల యొక్క కిరీటములను స్పృశించుచున్నది. ఈశ్వరుని ఒడి అనే మణిద్వీపములోనూ, కాంచీపురములోను, కొలువైన కామాక్షీ దేవి నాకు జ్ఞానమును ప్రసాదించుగాక!

43. అనాద్యంతా కాచిత్సుజననయనానందజననీ
నిరుంధానా కాంతిం నిజరుచివిలాసైర్జలముచామ్।

స్మరారేస్తారల్యం మనసి జనయంతీ స్వయమహో
గలత్కంపా శంపా పరిలసతి కంపాపరిసరే॥

జగన్మాతకు ఆది, అంతములు లేవు. సత్పురుషులకు ఆమె నేత్రానందము. నల్లని తన శరీర వర్ణముతో, వర్షపు నీటితో నిండి ఉన్న మేఘముల కాంతిని జయించునది, మన్మథుని బూడిద చేసిన ఈశ్వరుని మనసునే కలవరపరచినది, ఎల్లప్పుడు కరుణను ప్రసరించేది అయిన అమ్మ కంపా తీరములో ప్రభవిల్లుతున్నది.

44. సుధాడిండీర శ్రీః స్మితరుచిషు తుండీరవిషయం
పరిష్కుర్వానాసౌ పరిహసిత నీలోత్పలరుచిః।
స్తనాభ్యామానమ్రాం స్తబకయతు మే కాంక్షితతరుం
దృశామైశానీనాం సుకృతఫలపాండిత్యగరిమా॥

అమ్మ మందహాసము పాల సముద్రములోని తెల్లని నురగ కాంతి కలది. శరీరపు వర్ణము నల్లకలువల కాంతి తిరస్కరించునది. ఈశ్వరుని ప్రేమపూరిత దృక్కులకు పాత్రమైనది. తుండీర దేశములోని కాంచీపురములో వెలుగుతున్న కామాక్షీ దేవి, నా ఈ శరీర వృక్షమును పుష్పింపచేయుగాక!

45. కృపాధారాద్రోణీ కృపణధిషణానాం ప్రణ మతాం
నిహంత్రీ సంతాపం నిగమముకుటోత్తంసకలికా।
పరా కాంచీలీలాపరిచ యవతీ పర్వతసుతా
గిరాం నీవీ దేవీ గిరిశపరతంత్రా విజయతే॥

కామాక్షీదేవి, దయను భక్తులకు పుష్కలముగా ప్రసాదించునది. వేదములకు మణి వంటిది. భక్తులు ఏ స్థితిలో తనను ప్రార్థించినా వారి బాధలను పోగొట్టునది, పర్వతరాజ పుత్రి, కాంచీ పుర విహారిణి, ఈశ్వరునికి ప్రేమపాత్రురాలైన కామాక్షీ దేవికి జయము జయము.

46. కవిత్వశ్రీకందః సుకృతపరిపాటీ హిమగిరేః
విధాత్రీ విశ్వేషాం విషమశరవీరధ్వజపటీ।
సఖీ కంపానద్యాః పదహసితపాథోజయుగళీ
పురాణీ పాయాన్నః పురమథనసామ్రాజ్యపదవీ॥

కామాక్షీ దేవి, కవిత్వ సంపదకు పుట్టినిల్లు. హిమవంతుని పుణ్యాల పంట. సకల జగత్తులకు సృష్టికర్త. మన్మథునికి ఉపాసనా దైవము. కంపానదికి ఇష్ట సఖి. పద్మముల కాంతిని తిరస్కరించు పాదములు కలది. ఈశ్వరుని హృదయాధీశ్వరి, సనాతనమైనది అయిన మాత నన్ను కాపాడుగాక.

47. దరిద్రాణా మధ్యే దరదలితతాపిచ్ఛసుషమాః
స్తనాభోగక్లాంతాస్తరుణహరిణాంకాంకితకచాః।
హరాధీనా నానావిబుధముకుటీచుంబితపదాః
కదా కంపాతీరే కథయ విహరామో గిరిసుతే॥

ఓ పర్వతరాజపుత్రీ, అతి సన్నని కటి భాగముతో, వికసించి పుష్పించిన తమాల వృక్షపు శోభతో, చంద్రఖండమును దాల్చిన శిరసుతో, ఈశ్వరుని ప్రేమను పొంది, దేవతా కిరీటములను తాకే పాదములతో, కంపా తీరములో నీతో కలసి ఎప్పుడు నేను విహరించగలను.

48. వరీవర్తు స్థేమా త్వయి మమ గిరాం దేవి మనసో
నరీనర్తు ప్రౌఢా వదనకమలే వాక్యలహరీ।
చరీచర్తు ప్రజ్ఞాజనని జడిమానః పరజనే
సరీసర్తు స్వైరం జనని మయి కామాక్షి కరుణా॥

జగన్మాతా! నా మనసు, బుద్ధి ఎల్లప్పుడు నీ స్మరణములోనే నిలచి ఉండుగాక. వాక్ప్రదాయినీ, స్వచ్ఛమైన, గంభీరమైన వాక్కులు నా ముఖమునుండి వెలువడుగాక. నా శత్రువులందరిలోనూ, మందత్వము, జడత్వము నిండుగాక. నీ దయ నాపై ఎల్లప్పుడు ప్రసరించుగాక.

49. క్షణాత్తే కామాక్షీ భ్రమరసుషమాశిక్షణగురుః
కటాక్షవ్యాక్షేపో మమ భవతు మోక్షాయ విపదామ్।
నరీనర్తు స్వైరం వచనలహరీ నిరజరపురీ
సరిద్వీచీనీచీకరణపటురాస్యే మమ సదా॥

అమ్మా! తుమ్మెదల గుంపు ఇతరులను ఆకర్షించే విధమును నీనుంచే నేర్చుకున్నాయి. కేవలము నీ క్రీగంటి చూపు నన్ను అన్ని ఆపదలనుండి కాపాడుతుంది. నిన్ను స్తుతించడానికి వాక్ప్రవాహము నా ముఖమునుండి గంగాఝరివలే ప్రవహించుగాక.

50. పురస్తాన్మే భూయఃప్రశమనపరః స్తాన్మమ రుజాం
ప్రచారస్తే కంపాతటవిహృతిసంపాదిని దృశోః
ఇమాం యాచ్నా మూరీకురు సపది దూరీకురు తమః
పరీపాకం మత్కం సపది బుధలోకం చ నయ మామ్॥

అమ్మా! కంపాతీర విహారిణీ! నీ కరుణారస దృక్కులు నాలోని సర్వ వ్యాధులను నివారించుగాక. నా ప్రార్థనను స్వీకరించి, నాలోని పామరత్వమును తొలగించి, నన్ను పండితులలో ఒకరిగా చేయుము తల్లీ!

51. ఉదంచంతీ కాంచీనగరనిలయే త్వత్కరుణయా
సమృద్ధా వాగ్ధాటీ పరిహసితమాధ్వీ కవ యతామ్।
ఉపాదత్తే మారప్రతిభటజటాజూటముకుటీ
కుటీరోల్లాసిన్యాః శతమఖతటిన్యాజయపటీమ్॥

కాంచీపురములో విహరించే ఓ కామాక్షీ, నీ దయ కనుక ప్రసరించినట్లయితే, తేనెయొక్క తియ్యదనమును మించిన కవితాధార ఎంతో వేగముగా ప్రవహిస్తుంది. ఆ ధార పైకి ఎగసి, శివుని జటాజూటములో పరవళ్ళు త్రొక్కుతున్న గంగానది అంచులను తాకుతుంది.

52. శ్రియం విద్యాం దద్యాజ్జనని నమతాం కీర్తిమమితాం
సుపుత్రాన్ ప్రాదత్తే తవ ఝుటితి కామాక్షి కరుణా।
త్రిలోక్యామాధిక్యం త్రిపురపరిపంథిప్రణయిని
ప్రణామస్త్వత్పాదే శమితదురితే కిం న కురుతే॥

శివుని దేవేరివైన ఓ కామాక్షీ! నీ పాదాలను ఎవరు శరణు వేడుతారో, వారి పాపములన్నిటినీ నీవు తక్షణమే హరించి, వారికి ఐశ్వర్యమును, విద్యను, చిరయశస్సును ప్రసాదిస్తావు. నీ పాదనమస్కారము మూడు లోకములలోనూ పూజ్యతను ప్రసాదిస్తుందంటే ఇంక అంతకు మించి ఏమున్నాయి మాతా!

53. మనఃస్తంభం స్తంభం గమయదుపకంపం ప్రణమతాం
సదా లోలం నీలం చికురజితలోలంబనికరమ్।
గిరాం దూరం స్మేరం ధృతశశికిశోరం పశుపతేః
దృశాం యోగ్యం భోగ్యం తుహినగిరిభాగ్యం విజయతే॥

కంపానదీ తీరములో, సజ్జన శుభంకరి, నీలవర్ణ ప్రకాశము కలది, తన కురుల శోభతో భ్రమరములను ఆకర్షించునది, ముఖమున మందహాసముతో, చంద్రఖండమును శిరసున దాల్చి, శివునకు నేత్రానందకరివై వెలసిన మాత తన భక్తుల మనసనే స్తంభమును దృఢముగా నిలుపుతుంది.

54. ఘనశ్యామాంకామాంతకమహిషీ కామాక్షీ మధురాన్
దృశాం పాతానేతానమృతజలశీతాననుపమాన్।
భవోత్పాతే భీతే మయి వితర నాథే దృఢభవ-
న్మనశ్శోకే మూకే హిమగిరిపతాకే కరుణయా॥

జగన్మాతా, మన్మథుని జయించిన ఈశ్వరుని దేవేరీ, హిమవత్పుత్రీ, ఈ సంసారమనే చక్రభ్రమణములో చిక్కి విలవిలలాడుతూ, మాటలు రాని నాపైన, అమృతమువంటి నీ చూపులనే వర్షపు ధారను కురిపించి అనుగ్రహించు తల్లీ.

55. నతానాం మందానాం భవనిగలబంధాకులధియాం
మహాంధ్యం రుంధానామభిలషితసంతానలతికామ్।
చరంతీం కంపాయాస్తటభువి సవిత్రీం త్రిజగతాం
స్మరామస్తాం నిత్యం స్మరమథనజీవాతుకలికామ్॥

అమ్మా! నీ చరణములను శరణన్నవారు, అజ్ఞానపు బంధనములలో చిక్కుకున్నా, మందబుద్ధులైనా, వారి కోరికలను కల్పవృక్షమువలె తీరుస్తావు. ఈశ్వరుని ప్రాణము నీవే. మూడులోకములు నీలోనుండే ఉద్భవిస్తాయి. కంపాతీర విహారిణీ, నీకు నమస్కారము.

56. పరా విద్యా హృద్యాశితమదనవిద్యా మరకత
ప్రభానీలా లీలాపరవశితశూలాయుధమనాః।
తమఃపూరం దూరం చరణనతపౌరందరపురీ
మృగాక్షీ కామాక్షీ కమలతరలాక్షీ నయతు మే॥

జగన్మాత కామాక్షి పరవిద్యా స్వరూపిణి. మరకత మణుల నీలకాంతులతో మనోహరముగా ప్రకాశించునది. తన లీలా విలాసములచే ఈశ్వరుని సైతము మరపింపచేయునది. చంచలమైన నేత్రములు కలిగిన మాత నా అజ్ఞానమును తొలగించుగాక.

57. అహంతాఖ్యా మత్కం కబలయతి హా హంత హరిణీ
హఠాత్సంవిద్రూపం హరమహిషి సస్యాంకురమసౌ।
కటాక్షవ్యాక్షేపప్రకటహరిపాషాణపటలైః
ఇమాముచ్చైరుచ్చాటయ ఝటితి కామాక్షి కృపయా॥

అమ్మా! జ్ఞానము అనే నా మనసుయొక్క పంటపొలములో అహంకారము అను ఒక జింక ప్రవేశించి, ఏపుగా పెరిగిన పంటను, తిని, త్రొక్కి పాడుచేస్తున్నది. ఆ జింకను నీ చూపులనే రాళ్ళతో కొట్టి దూరముగా తరిమివేయవమ్మా!

58. బుధే వా మూకే వా తవ పతతి యస్మిన్క్షణమసౌ
కటాక్షః కామాక్షి ప్రకటజడిమక్షోదపటిమా।
కథంకారం నాస్మై కరముకులచూడాలముకుటా
నమోవాకం బ్రూయుర్నముచిపరిపంథిప్రభృతయః॥

అమ్మా! అజ్ఞానమును, జడత్వమును తొలగించే నీ దృష్టి ఎవరిపై కొద్దిసేపైనా పడుతుందో, అతడు పండితుడైనా, పామరుడైనా, బధిరుడైనా, ఇంద్రాది దేవతలు వానికి తమ శిరసులు వంచి నమస్కారం చేస్తారు.


Kiron Type Institute

59. ప్రతీచీం పశ్యామః ప్రకటరుచినీవారకమణీ
ప్రభాసధ్రీచీనాం ప్రదలితషడాధారకమలామ్।
చరంతీం సౌషుమ్నే పథి పరపదేందు ప్రవిగలత్
సుధార్ద్రాం కామాక్షీం పరిణతపరంజ్యోతిరుదయామ్॥

ధాన్యపు కంకివంటి ఎర్రని కాంతితో సమానముగా ప్రకాశించు తల్లి సుషుమ్నా నాడి ద్వారా మూలాధారమునుండి మొదలై సహస్రారమునకు చేరి అక్కడ ఈశ్వరుని అమృతధారలలో తడిసిపోయిన పరంజ్యోతి మాకు దర్శనమిచ్చి ధన్యులను చేయుగాక!

60. జంభారాతిప్రభృతిముకుటీః పాదయోః పీఠయంతీ
గుమ్ఫాన్వాచాం కవిజనకృతాన్స్వైరమారామయంతీ।
శంపాలక్ష్మీం మణిగణరుచాపాటలైః ప్రాపయంతీ
కంపాతీరే కవిపరిషదాం జృంభతే భాగ్యసీమా॥

అమ్మను అద్భుతముగా వర్ణించే కవీంద్రుల సొత్తు కంపాతీరములో వసించి, సకల దేవతల కిరీటములను తన పాద పీఠముగా చేసుకొన్నది. కవుల మధుర కవిత్వమే, ఆమె విహారమైనది. ఆ విహార స్థలములో ఆ తల్లి తీగలుగా అల్లుకొనుచున్నది.

61. చంద్రాపీడాం చతురవదనాం చంచలాపాంగలీలాం
కుందస్మేరాం కుచభరనతాం కుంతలోద్ధూతభృంగామ్।
మారారాతేర్మదనశిఖినం మాంసలం దీపయంతీం
కామాక్షీం తాం కవికులగిరాం కల్పవల్లీముపాసే॥

కామాక్షీ మాత చంద్రుని కిరీటముగా ధరించి, తన మాటలతో సకల కార్యములను సాధించి, క్రీగంటి దయా చూపులను ప్రసరిస్తూ, మల్లెపూల కాంతిని తిరస్కరించే చల్లని చిరునవ్వుతో, తుమ్మెదలను జయించే కుంతలములతో, మన్మథుని తన నేత్రాగ్నితో భస్మం చేసిన ఈశ్వరునిలోనే కామాగ్నిని రగిల్చిన దేవికి నమస్కారము.

62. కాలాంభోదప్రకరసుషమాం కాంతిభిస్తిర్జయంతీ
కల్యాణానాముదయసరణీః కల్పవల్లీ కవీనామ్।
కందర్పారేః ప్రియసహచరీ కల్మషాణాం నిహంత్రీ
కాంచీదేశం తిలకయతి సా కాపి కారుణ్యసీమా॥

అమ్మా! నీ నల్లని శరీర కాంతి చూసి, అత్యంత నల్లని మేఘముల సమూహము వెలవెల పోతున్నది. శుభములను చేకూర్చే తల్లివి నీవు. కవులకు కల్పవృక్షము, శివునకు ప్రియమైన దేవేరివి, కాంచీపురమును ప్రకాశింపచేస్తున్న నీకు ఇవే నా ప్రణతులు.

63. ఊరీకుర్వన్నురసిజతటే చాతురీం భూధరాణాం
పాథోజానాం నయనయుగళే పరిపంథ్యం వితన్వన్।
కంపాతీరే విహరతి రుచా మోఘయన్మేఘశైలీం
కోకద్వేషం శిరసి కలయన్నోపి విద్యావిశేషః॥

సకల జ్ఞానములకు మూల రూపమైన మాత కంపా తీరములో విహరించుచున్నది. జగత్పోషకములైన మాతృస్థానములతో అలరారే తల్లి, తన కన్నులకు పద్మములతో జగడమును కలిగి ఉన్నది. తన శరీరపు నల్లని కాంతితో నీలి మేఘపు కాంతిని త్రోసి రాజంటున్నది.

64. కాంచీలీలాపరిచయవతి కాపి తాపింఛలక్ష్మీః
జాడ్యారణ్యే హుతవహశిఖా జన్మభూమిః కృపాయాః
మాకందశ్రీర్మధురకవితాచాతురీ కోకిలానాం
మార్గే భూయాన్మమ నయన యోర్మాన్మథీ కాపి విద్యా॥

కాంచీపురములో సంచరించే అమ్మ తమాల వృక్షపు మేని కాంతిని కలిగి ఉన్నది. జడత్వము అనే అరణ్యమును, కార్చిచ్చు లాగా దహించు తల్లి దయయే స్వరూపముగా కలది. కవిత్వ సంపదకు పుట్టినిల్లు. కవికోకిలకు నెలవైన ఆమ్ర వృక్షము అయిన తల్లి నా కనుల ముందు ప్రత్యక్షమగునుగాక.

65. సేతుర్మాతర్మరతకమయో భక్తిభాజాం భవాబ్ధౌ
లీలాలోలా కువలయమయీ మాన్మథీ వైజయంతీ।
కాంచీభూషా పశుపతిదృశాం కాపి కాలాంజనాలీ
మత్కం దుఃఖం శిథిలయతు తే మంజుళాపాంగమాలా॥

జగన్మాతా! దయారసపూరితములైన నీ కరుణాదృష్టి నా బాధలను నశింపచేయుగాక. ఆ చల్లని చూపులు తన భక్తులను సంసార సాగరమును దాటించే మణులతో కట్టిన వారధి. కాంచీపురమునకు అలంకారమైన కామాక్షి ఈశ్వరుని నేత్రములకు ఆనందమును కలిగించే అంజనము వంటిది.

66. వ్యావృణ్వానాః కువలయదలప్రక్రియావైరముద్రాం
వ్యాకుర్వాణా మనసిజమహారాజసామ్రాజ్యలక్ష్మీమ్।
కాంచీలీలావిహృతిరసికే కాంక్షితం నః క్రియాసుః
బంధచ్ఛేదే తవ నియమినాం బద్ధదీక్షాః కటాక్షాః॥

కాంచీ పురంఉలో విహరించే మాతా, కలువ పూవులు నీ ముఖ సౌందర్యమును చూసి సిగ్గుపడుతున్నాయి. నీ కనులు కామదేవుని సామ్రాజ్యలక్ష్మిని వ్యాఖ్యానిస్తున్నాయి. నీ దీక్షాబద్ధులైన సంసారులను విరాగులుగా మార్చి నీ కరుణారస దృష్టిని మాపై ప్రసరింప చేస్తున్నాయి.

67. కాలాంభోదే శశిరుచి దలం కైతకం దర్శయంతీ
మధ్యేసౌదామిని మధులిహాం మాలికాం రాజయంతీ।
హంసారావం వికచకమలే మంజుముల్లాసయంతీ
కంపాతీరే విలసతి నవా కాపి కారుణ్యలక్ష్మీః॥

అమ్మా! నల్లని కారుమేఘములలో తెల్లని చంద్రకాంతి అనే మెరుపు తీగను సిగలో ధరించి, ఆ మెరుపు తీగకు నీ నవ్వులను పుష్పములుగా ప్రకాశింపచేసి, నీ నోటి ద్వారా మధుర ధ్వనులు పలికిస్తూ, దయాసముద్రురాలైన ఒక మాతృమూర్తి కంపా తీరములో విహరించుచున్నది.

68. చిత్రం చిత్రం నిజమృదుతయా భర్త్సయన్పల్లవాలీం
పుంసాం కామాన్భువిచనియతం పూరయన్పుణ్యభాజామ్।
జాతః శైలాన్న తు జలనిధేః స్వైరసంచారశీలః
కాంచీభూషా కలయతు శివం కోపి చింతామణిర్మే॥

తన మేని మృదుత్వముతో చిగురుటాకుల మెత్తదనమును పరిహసిస్తూ, తన భక్తుల సకల కోరికలను నెరవేరుస్తూ, పర్వత పుత్రియై, కాంచీపురములో, కంపా తీరములో ఆనందముగా విహరిస్తున్న మాత మాకు సకల శుభములను ప్రసాదించుగాక.

69. తామ్రాంభోజం జలదనికటే తత్ర బంధూకపుష్పం
తస్మిన్మల్లీకుసుమసుషమాం తత్ర వీణానినాదమ్।
వ్యావృన్వానా సుకృతలహరీ కాపి కాంచినగర్యామ్
ఐశానీ సా కలయతితరామైంద్రజాలం విలాసమ్॥

కామాక్షీ! నల్లని కేశపాశములలో ఉన్న నీ ముఖారవిందము, మంకెన పుష్పములవంటి ఎర్రని పెదవులతో కూడి, ఆ పెదవులపై మల్లె పూవులవంటి తెల్లని చిరునవ్వుతో, వీణా స్వరమువంటి మధుర వాక్కులతో, ఈశ్వరుని లీలావిలాసములను వివరిస్తూ, కాంచీపురములో ఒక తల్లి తన విద్యలను ప్రదర్శిస్తున్నది.

70. ఆహోరాంశం త్రిదశసదసామాశ్రయే చాతకానామ్
ఆకాశోపర్యపి చ కలయన్నాలయం తుంగమేషామ్।

కంపాతీరే విహరతితరాం కామధేనుః కవీనాం
మందస్మేరో మదననిగమప్రక్రియాసంప్రదాయః॥

అమ్మా! కామాక్షీ! నీ సిగలో చంద్రుడు మబ్బులలో చాతక పక్షివలే ఉన్నాడు. నీ మాతృస్థానములు, ఆకాశమును తాకే భవనమువలే ఉన్నవి. నీ చిరునవ్వు కవులలో కవితాధారాలను ప్రసరింపచేయునది. ఈ లక్షణములుగల తల్లి కంపా తీరములో విహరిస్తున్నది.

71. ఆర్ద్రీభూతైరవిరలకృపైరాత్తలీలావిలాసైః
ఆస్థాపూర్ణైరధికచపలైరంచితాంభోజశిల్పైః।
కాంతైర్లక్ష్మీలలితభవనైః కాంతికైవల్యసారైః
కాశ్మల్యం నః కబలయతు సా కామకోటీ కటాక్షైః॥

అమ్మా! కామాక్షీ! నీ చూపులు దయతోనూ, కరుణారసముతోను నిండి ఉన్నవి. అత్యంతవిలాసమై చంచలమైనవి. మా కోర్కెలన్నిటినీ నెరవేర్చేవి. సకల సంపదలకు నిలయములు నీ నేత్రములు. ప్రకాశవంతమైన నీ దృష్టి మాలోని మాలిన్యమును తొలగించుగాక.

72. ఆధూన్వంత్యై తరలనయనైరాంగజీం వైజయంతీమ్
ఆనందిన్యై నిజపదజుషామాత్తకాంచీపురాయై।
ఆస్మాకీనం హృదయమఖిలైరాగమానాం ప్రపంచైః
ఆరాధ్యాయై స్పృహయతితరామాదిమాయై జనన్యై॥

అమ్మా! నీ చూపులలో మన్మథ పతాకము రెపరెపలాడుతోంది. నిన్ను ఆశ్రయించిన వారికి సకలైశ్వర్యములను ప్రసాదిస్తావు. వేదములచేత స్తుతింపబడేదానవు నీవు. అమ్మలకు అమ్మవైన ఓ కామాక్షీ, నా మనసు నీలో ఎంతో ఆనందముగా సంచరిస్తున్నదమ్మా.

73. దూరం వాచాం త్రిదశసదసాం దుఃఖసింధోస్తరిత్రం
మోహక్ష్వేలక్షితిరుహవనే క్రూరధారం కుఠారమ్।
కంపాతీరప్రణయి కవిభిర్వర్ణితోద్యచ్చరిత్రం
శాంత్యై సేవే సకలవిపదాం శాంకరం తత్కలత్రమ్॥

అమ్మా! నీ వాక్కు దేవతల వాక్కులకన్నా ఎంతో గొప్పది. ఈ భవసాగరమును దాటించే నౌకవు నీవు. సంసారమనే ఆరణ్యములో ఉన్న మోహము అనే మహా వృక్షములను ఖండించే గొడ్డలివి నీవు. కవులకు వర్ణనాతీతమైనది నీ చరితము. మాతా! కంపా తీర విహారిణీ! ఈశ్వరుని దేవేరీ! మమ్ములను అన్ని ఆపదలనుండి కాపాడుము.

74. ఖండీకృత్య ప్రకృతికుటిలం కల్మషం ప్రాతిభశ్రీ
శుండీరత్వం నిజపదజుషాం శూన్యతంద్రం దిశంతీ।
తుండీరాఖ్యే మహతి విషయే స్వర్ణవృష్టిప్రదాత్రీ
చండీ దేవీ కలయతి రతిం చంద్రచూడాలచూడే॥

జగన్మాతా! ఈ ప్రకృతిలో నిండి ఉన్న మలినమును తొలగిస్తూ, సచ్చిదానంద స్వరూపిణిగా భక్తులను కరుణిస్తూ, జ్ఞానమును ప్రసాదిస్తూ, చంద్ర రేఖను సిగలో ధరించిన ఓ చండీమాతా! భక్తులకు కొంగుబంగారమై నీవు కాంచీపురములో వెలసి ఉన్నావు.

75. యేన ఖ్యాతో భవతి స గృహీ పూరుషో మేరుధన్వా
యద్దృక్కోణే మదననిగమప్రాభవం బో భవీతి।
యత్ప్రీత్యైవ త్రిజగదధిపో జృంభతే కింపచానః
కంపాతీరే స జయతి మహాన్కశ్చిదోజోవిశేషః॥

అమ్మా! విరక్తుడైన ఈశ్వరుని నీవు గృహస్తుగా మార్చావు. నీ క్రీగంటి కొనలనుండి ఈశ్వరుడు, మన్మథ వేదాన్ని పఠిస్తున్నాడు. నీ దయవలనే ఆదిభిక్షువు మూడులోకములకు అధిపతి అయ్యాడు. అంత మహిమ గల తల్లి కాంచీపురములోని కంపాతీరములో విహరించుచున్నది.

76. ధన్యా ధన్యా గతిరిహ గిరాం దేవి కామాక్షి యన్మే
నింద్యాం భింద్యాత్సపదిజడతాం కల్మషాదున్మిషంతీమ్।
సాధ్వీ మాధ్వీరసమధురతాభంజినీ మంజురీతిః
వాణీవేణీ ఝుటితి వృణుతాత్స్వర్ధునీస్పర్ధినీ మామ్॥

అమ్మా! కామాక్షీ! నాలో ఉన్న పాపమునుండి, అజ్ఞానము ప్రబలుచున్నది. దానిని నరికివేయుము. తేనెవలే తీయనిది, పవిత్రమైనది, గంగానదివంటి కవితా వాక్ప్రవాహ ధారను నాలో జనింపచేయుము. ఆ వాక్కులతో నన్ను ధన్యుని చేయుము.

77. యస్యావాటీ హృదయకమలం కౌసుమీ యోగభాజాం
యస్యాః పీఠీ సతతశిశిరా శీకరైర్మాకరందైః।
యస్యాః వేటీ శ్రుతిపరిచలన్మౌళిరత్నస్య కాంచీ
సా మే సోమాభరణమహిషీ సాధయేత్కాంక్షితాని॥

అమ్మా! యోగుల, జ్ఞానుల హృదయము నీకు నిరంతర విహార స్థలము. ఎల్లప్పుడూ, మకరందముతో నిండి ఉండే పద్మము నీకు పాద పీఠము. వేదముల శిరోరత్నమే నీవు వెలసిన కాంచీపురము. అమ్మా! శివానీ! దయచేసి నీ కరుణను మాపై కురిపించు.

78. ఏకా మాతా సకలజగతామీయుషీ ధ్యానముద్రామ్
ఏకామ్రాధీశ్వరచరణయోరేకతానాం సమింధే।
తాటంకోద్యన్మణిగణరుచా తామ్రకర్ణప్రదేశా
తారుణ్యశ్రీస్తబకితతనుస్తాపసీ కాపి బాలా॥

కాంచీపురములో, ఏకాంబరేశ్వరుని పాదములలో ధ్యానముద్రా ధారిణియై, కర్ణాభరణముల బరువుకు ఎర్రబడిన చెవులు కలది, యౌవనవతియై తాపసియైన ఒక బాలికామణి ప్రకాశించుచున్నది.

79. దంతాదంతిప్రకటనకరీ దంతిభిర్మందయానైః
మందారాణాం మదపరిణతిం మథ్నతీ మందహాసైః।
అంకూరాభ్యాం మనసిజతరోరంకితోరాః కుచాభ్యా
మంతఃకాంచి స్ఫురతి జగతామాదిమా కాపి మాతా॥

తన మందగమనముతో గజములతో పోటీపడుతూ, తన చల్లని చిరునవ్వులతో మందార పుష్పములకు గర్వభంగము చేస్తూ, మన్మథ వృక్షమునకు చక్కగా అమరిన వక్షస్థలముతో, అమ్మలను కన్న అమ్మ కాంచీపురములో స్థితురాలై ఉన్నది.

80. త్రియంబకకుటుంబినీం త్రిపురసుందరీమిందిరాం
పులిందపతిసుందరీం త్రిపురభైరవీం భారతీమ్।
మతంగకులనాయికాం మహిషమర్దనీం మాతృకాం
భణంతి విబుధోత్తమా విహృతిమేవ కామాక్షి తే॥

అమ్మా! కామాక్షీ! నీవు త్రిలోచన కుటుంబినివి. త్రిపుర సుందరివి. పండితులచే ఇందిర, పులిందిని, త్రిపుర భైరవి, భారతి, మాతంగి, మహిషమర్ధినీ, మాతృక అని కీర్తింపబడే మాత మమ్ములను కరుణించుగాక.

81. మహామునిమనోనటీ మహితరమ్యకంపాతటీ
కుటీరకవిహారిణీ కుటిలబోధసంహారిణీ।
సదా భవతు కామినీ సకలదేహినాం స్వామినీ
కృపాతిశయ కింకరీ మమ విభూతయే శాంకరీ॥

గొప్పవారైన మునుల హృదయములో నటించునది, కంపానదీ తీరమందున్న కుటీరములలో సంచరించునది, మోహమును పారద్రోలునదీ, ఈ సమస్త జగత్తును సృష్టించినది, అత్యంత దయతో శుభములు ప్రసాదించునదీ అయిన కామాక్షీ దేవి నాకు ఐశ్వర్యమును ప్రసాదించుగాక.


Kiron Type Institute
కిరణ్ టైప్ ఇన్‌స్టిట్యూట్

82. జడాః ప్రకృతినిర్ధనా జనవిలోచనారుంతుదా
నరా జనని వీక్షణం క్షణమవాప్య కామాక్షి తే।
వచస్సు మధుమాధురీం ప్రకటయంతి పౌరందరీ
విభూతిషు విడంబనాం వపుషి మాన్మథీం ప్రక్రియామ్॥

అమ్మా! నీ కరుణారస చూపులు ప్రసరించినట్లయితే, మందబుద్ధి కలవారు జ్ఞానులుగాను, దరిద్రులు ఐశ్వర్యవంతులుగాను, కురూపులు మన్మథుని మించిన సుందరాకారులుగానూ, మారుతారు. దీని అర్థం ఏమిటంటే అమ్మా! జ్ఞానము, ఐశ్వర్యము, రూపము అన్ని కూడా నీ కటాక్షమువలననే లభిస్తాయి.

83. ఘనస్తనతటస్ఫుటస్ఫురితకంచులీచంచలీ
కృతత్రిపురశాసనా సుజనశీలితోపాసనా।
దృశోః సరణిమశ్నుతే మమ కదా ను కాంచీపురే
పరా పరమయోగినాం మనసి చిత్కలా పుష్కలా॥

అమ్మా! నీ మాతృస్థానములను ప్రకాశపరిచే కంచుకమును ధరించి, ఈశ్వరుని చలింపజేసి, సజ్జనులచే ఆరాధింపబడుతూ, యోగి జనుల హృదయములలో వెలిగెడి చైతన్యమై, కాంచీపురములో ప్రకాశిస్తున్న నీవు నా నేత్రములకు ఎప్పుడు దర్శన మిస్తావో కదా.

84. కవీంద్రహృదయేచరీ పరిగృహీతకాంచీపురీ
నిరూఢకరుణాఝరీ నిఖిలలోకరక్షాకరీ।
మనఃపథదవీయసీ మదనశాసనప్రేయసీ
మహాగుణగరీయసీ మమ దృశోస్తు నేదీయసీ॥

కవివరేణ్యుల హృదయములో ప్రవాహమువలే సంచరించునది, కాంచీపురమే తన గృహసీమయైనది, దయారస ప్రవాహమైనది, సకల లోక రక్షిణీ, వర్ణనాతీతమైనది, ఈశ్వరుని దేవేరి, ఉత్తమ గుణ సంపన్న అయిన మాత నాకు ప్రత్యక్షమగునుగాక.

85. ధనేన న రమామహే ఖలజనాన్న సేవామహే
న చాపలమయామహే భవభయాన్న దూయామహే।
స్థిరాం తనుమహేతరాం మనసి కిం చ కాంచీరత
స్మరాంతకకుటుంబినీచరణపల్లవోపాసనామ్॥

అమ్మా! నాకు ధనవాంఛ లేదు. చెడ్డవారిని నేను సేవించను, నాకు చాంచల్యము లేదు. సంసార మోహము అసలే లేదు. కాంచీపురములో వెలసిన లేత చిగురుటాకుల వంటి కామాక్షీదేవి పాదములను సేవించుటయందే నా మనసు ఏకాగ్రత కలిగి ఉన్నది.

86. సురాః పరిజనా వపుర్మనసిజాయ వైరాయతే
త్రివిష్టపనితంబినీకుచతటీ చ కేలీగిరిః।
గిరః సురభయో వయస్తరుణిమా దరిద్రస్య వా
కటాక్షసరణౌ క్షణం నిపతితస్య కామాక్షి తే॥

జగన్మాతా! నీ క్రీగంటి చూపులు ఎవరిపై ప్రసరిస్తాయో, వారికి దేవతలుకూడా సేవకులౌతారు. అటువంటి వారు, మన్మధునికంటే ఎక్కువ శరీర సౌందర్యము, ఇహ లోకమునందు, పరలోకమునందు సౌఖ్యములు, శాశ్వతమైన కీర్తి పొందుతారు.

87. పవిత్రయ జగత్త్రయీవిబుధబోధజీవాతుభిః
పురత్రయవిమర్దినః పులకకంచులీదాయిభిః।
భవక్షయవిచక్షణైర్వ్యసనమోక్షణైర్వీక్షణైః
నిరక్షరశిరోమణిం కరుణయైవ కామాక్షి మామ్॥

అమ్మా! కామాక్షీ! నీ చల్లని చూపులు మూడు లోకములలోని వారికి జ్ఞానమును ప్రసాదిస్తాయి. ఈశ్వరునకు ఆనంద దాయకములు. సంసార సాగరమును దాటగల వివేక జ్ఞానమును కల్గించునవి, దురలవాట్లను పారద్రోలునవి, అయిన నీ కరుణారస దృష్టి నన్ను పవిత్రుని చేయుగాక.

88. కదా కలితఖేలనాః కరుణయైవ కాంచీపురే
కలాయముకులత్విషః శుభకదంబపూర్ణాంకురాః।
పయోధరభరాలసాః కవిజనేషు తే బంధురాః
పచేలిమకృపారసా పరిపతంతి మార్గే దృశోః॥

మాతా! సమస్త లోకములను రక్షించే ఉద్దేశ్యముతో కాంచీపురములో నీవు అనేక విలాసములు చూపుతున్నావు. ఇరుగుడు పుష్పముల కాంతితో, నల్లనైన శరీర శోభతో, కవులలోని కవిత్వ కాంతితో, దయాపూర్ణమైన చూపులతో ఉన్న నీవు నాకెప్పుడు దర్శనమిస్తావు తల్లీ.

89. అశోధ్యమచలోద్భవం హృదయనందనం దేహినామ్
అనర్ఘమధికాంచి తత్కిమపి రత్నముద్యోతతే।
అనేన సమలంకృతా జయతి శంకరాంకస్థలీ
కదాస్య మమ మానసం వ్రజతి పేటికావిభ్రమమ్॥

పరిశుద్ధ స్వరూపిణి, ఆనందదాయిని, కాంచీపురములో వెలసిన ఒక అమూల్య రత్నము, ఈశ్వరుని వామ భాగములో నిలచి ఆ భాగమును కాంతివంతము చేయు చున్నది. అటువంటి మణి నా హృదయము అనే పెట్టెలో ఎప్పుడు భద్రమవుతుందో కదా.

90. పరామృతఝరీప్లుతా జయతి నిత్యమంతశ్చరీ
భువామపి బహిశ్చరీ పరమసంవిదేకాత్మికా।
మహద్భిరపరోక్షితా సతతమేవ కాంచీపురే
మమాన్వహమహంమతిర్మనసి భాతు మాహేశ్వరీ॥

అమృత ధారలతో పూర్తిగా తడిసినది, సమస్త జగత్తుకు ఆవలా - ఈవలా కూడా వ్యాపించి ఉన్నది, జ్ఞాన స్వరూపిణీ, అందరిలో ఆత్మస్వరూపమై నిలచినది, కాంచీ నగరములో దర్శనమిచ్చునది, బ్రహ్మస్వరూపిణి అయిన మాత నాలో ఎల్లప్పుడు ప్రకాశించుగాక.

91. తమోవిపినధావినం సతతమేవ కాంచీపురే
విహారరసికా పరా పరమసంవిదుర్వీరుహే।
కటాక్షనిగళైర్దృఢం హృదయదుష్టదంతావలం
చిరం నయతు మామకం త్రిపురవైరిసీమంతినీ॥

కాంచీపురములో ఎల్లప్పుడూ విహరించే ఆసక్తి కలది, ఈశ్వరుని దేవేరి, అజ్ఞానము అనే కీకారణ్యములో ఘీంకరించే నా మనసనే మదగజమును నీ క్రీగంటి చూపులనే గొలుసులతో బంధించి జ్ఞానమనే వృక్షమునకు బంధించి వేయుము.

92. త్వమేవ సతి చండికా త్వమసి దేవి చాముండికా
త్వమేవ పరమాతృకా త్వమపి యోగినీరూపిణీ।
త్వమేవ కిల శాంభవీ త్వమసి కామకోటీ జయా
త్వమేవ విజయా త్వయి త్రిజగదంబ కిం బ్రూమహే॥

ముజ్జగములను కాచే మాతా, కామాక్షీ, నీవే చండికవు, నీవే చాముండవు, అక్షర స్వరూపిణివి, యోగినీ స్వరూపిణివి, శాంభవి, కామకోటి, జయ, విజయ, ఇలా నీ రూపములను ఎన్నిటినని నేను వర్ణించగలను.

93. పరే జనని పార్వతి ప్రణతపాలిని ప్రాతిభ
ప్రదాత్రి పరమేశ్వరి త్రిజగదాశ్రితే శాశ్వతే।
త్రియంబకకుటుంబిని త్రిపదసంగిని త్రీక్షణే
త్రిశక్తిమయి వీక్షణం మయి నిధేహి కామాక్షి తే॥

అమ్మా! నీవు అందరికంటే ఉన్నతురాలవు. ఓ జగజ్జననీ, నిన్ను శరణు కోరిన వారిని కరుణించి, జ్ఞాన భిక్షను ప్రసాదించి, మూడు జగములకు ఆశ్రయమైన నీవు నిత్యవు, విశ్వరూపిణివి, త్రినేత్రవు, త్రిమూర్తి స్వరూపిణివి, నీ కరుణారస దృష్టిని నాపై కురిపించు తల్లీ.

94. మనోమధుకరోత్సవం విదధతీ మనీషాజుషాం
స్వయంప్రభవవైఖరీవిపినవీథికాలంబినీ।
అహో శిశిరితా కృపామధురసేన కంపాతటే
చరాచరవిధాయినీ చలతి కాపి చిన్మంజరీ॥

మాతా! కామాక్షీ! జ్ఞానుల హృదయమనే తుమ్మెదలకు ఆనందమును కలుగచేస్తూ, తమంత తాముగా ప్రకాశించే వేదములకు ఆధారభూతమై, కరుణా అనే మధువుతో కంపా తీరమును పూర్తిగా తడిపి, సకల జగత్తులను సృష్టించే నీవు, కంపానదీ తీరములో విహరిస్తున్నావు.

95. కలావతి కలాభృతో ముకుటసీమ్ని లీలావతి
స్పృహావతి మహేశ్వరే భువన మోహనే భాస్వతి।
ప్రభావతి రమే సదా మహితరూపశోభావతి
త్వరావతి పరే సతాం గురుకృపాంబుధారావతి॥

అమ్మా! నీవు చంద్రకళలతో ప్రభవిస్తూ, చంద్రుని సిగలో దాల్చినవాని ఇల్లాలివై, మహేశ్వరుని ప్రియురాలివై, స్వయంప్రకాశము కలిగి, అత్యంత సౌందర్యవతివై, సద్గుణులను రక్షించుటయందు ఆసక్తిగలమాతా! పరదేవతా! గురు మండల స్వరూపిణీ! నా మనసు నీయందే లగ్నమగునుగాక.

96. త్వయైవ జగదంబయా భువనమండలం సూయతే
త్వయైవ కరుణార్ద్రయా తదపి రక్షణం నీయతే।
త్వయైవ ఖరకోపయా నయనపావకే హూయతే
త్వయైవ కిల నిత్యయా జగతి సంతతం స్థీయతే॥

ఈ సమస్త విశ్వము జగజ్జననివైన నీ నుండే ఉద్భవిస్తున్నది. తల్లీ! ఆ విశ్వము నీ చేతనే రక్షించబడుతున్నది. నీ మూడవ నేత్ర జ్వాలలోనే విశ్వము లయము కావించబడుతున్నది. ఈ విశ్వమును రక్షించుటకు నీకు తప్ప మరెవరికి శక్తి కలదు.

97. చరాచరజగన్మయీం సకలహృన్మయీం చిన్మయీం
గుణత్రయమయీం జగత్త్రయమయీం త్రిధామామయీమ్।
పరాపరమయీం సదా దశదిశాం నిశాహర్మయీం
పరాం సతతసన్మయీం పరమచిన్మయీం శీలయే॥

ఈ జగత్తులో చరములు, అచరములు అన్నిటిలోనూ నీవే నిండి ఉన్నావు. సకల జనుల హృదయములలోనూ నీవే కొలువై ఉన్నావు. నీవు త్రిగుణాత్మికవు. రాత్రి - పగలు నీ రూపమే. శక్తి రూపిణివి, చైతన్య స్వరూపిణివి అయిన నిన్ను నిరంతరం ధ్యానిస్తాను.

98. జయ జగదంబికే హరకుటుంబిని వక్త్రరుచా
జితశరదంబుజే ఘనవిడంబిని కేశరుచా।
పరమవలంబనం కురు సదా పరరూపధరే
మమ గతసంవిదో జడిమడంబరతాండవినః॥

ఓ జగదంబికా, ఈశ్వరుని దేవేరీ, నీ నేత్రముల ప్రకాశముతో కమలముల కాంతిని గెలిచిన మాతా! కేశపాశముల కాంతితో, మేఘముల కాంతిని జయించినదానా, జ్ఞానమును పోగొట్టుకుని అజ్ఞాన స్వరూపమై నిలిచిన నన్ను నీ హస్తము నందించి నన్ను ఉద్ధరించు.

99. భువనజనని భూషాభూతచంద్రే నమస్తే
కలుషశమని కంపాతీరగేహే నమస్తే।
నిఖిలనిగమవేద్యే నిత్యరూపే నమస్తే
పరశివమయి పాశచ్ఛేదహస్తే నమస్తే॥

సమస్త లోకములను కన్న తల్లీ! సకల పాపములను తొలగించు మాతా! నిత్యవు, శాశ్వతవు, ఈశ్వరతత్వముతో పూర్తిగా నిండిన దానవు నీవు. అటువంటి నిన్ను నా పాశములను ఛేదించవలసినదిగా ప్రార్థిస్తూ నమస్కరిస్తున్నాను.

100.సమరవిజయకోటీ సాధకానందధాటీ
మృదుగుణపరివేటీ ముఖ్యకాదంబవాటీ।
మునినుతపరిపాటీ మోహితాజాండకోటీ
పరమశివవధూటీ పాతు మాం కామకోటీ॥

ఏ సమరములోనైనా నీవే విజేతవు. నీ ఉపాసకులకు ఆనంద స్వరూపిణివి, సకల గుణస్వరూపిణివి, కదంబవన సంచారిణివి, యోగులచే స్తుతించబడుదానవు, సకల జగత్తును మోహింపచేయు దానవు, కామకోటి పీఠములో స్థితురాలైన మాత నన్ను రక్షించుగాక.

101.క్వణత్కాంచీ కాంచీపురమణివిపంచీలయఝురీ
శిరఃకంపా కంపావసతిరనుకంపాజలనిధిః।
ఘనశ్యామా శ్యామా కఠినకుచసీమా మనసి మే
మృగాక్షీ కామాక్షీ హరనటనసాక్షీ విహరతాత్॥

అమ్మా! కామాక్షీ! మధురముగా ధ్వనిస్తున్న నీ మొలనూలుతో, కాంచీపురమనే వీణా వాదనకు ఆనందముగా శిరసు ఊపుతూ, కంపానదియే సముద్రమనే నీకు తీరమై, నల్లని వర్ణముతో, జింకల నేత్రములను కలిగి, ఈశ్వరుని తాండవమునకు ఏకైక సాక్షివైన ఓ మాతా! నీవు సదా నా హృదయములో నర్తింతువుగాక.

102. ఇమం పరవరప్రదం ప్రకృతిపేశలం పావనం
పరాపరచిదాకృతిప్రకటనప్రదీపాయితమ్।
స్తవం పఠతి నిత్యదా మనసీ భావయన్నంబికాం
జపైరలమలం మఖైరధికదేహసంశోషణైః॥

ఎవరైతే, అను నిత్యము, వరప్రదాయిని, సుకుమారి, పరము - అపరము - చిత్ అను మూడు రూపములు కలిగినదానివి, కాంతి స్వరూపిని అయిన కామాక్షీ దేవిని స్మరిస్తారో, వారికి ఇతర మంత్రములతో, జపములతో ఏ మాత్రము పని లేదు.

**మూక పంచశతిలో మూడవదైన "స్తుతి శతకం" సంపూర్ణమ్**

– – – = – – –

